# SYAMANTHAKOPAKHYANAM

FROM

Erra Preggada's Harivamsam

Edited with Introduction and Notes,

BY

KORADA RAMAKRISTNIAH B.A

AND

ADIDAM RAMARAO,

*Maharajah's College, Vizianagram.*

Printed at K. S. Rao's. S. V. V. Press,

VIZIANAGRAM.

1920

 [Price 8 annas.

# ఉపోద్ఘాతము

పదునాల్గవ శతాబ్ది ప్రారంభమున నాంధ్ర సామ్రాజ్య లక్ష్మీధురంధరుఁడగు నోరుగంటి ప్రతాపరుద్రుఁడు ఢిల్లీ చక్రవర్తిచే నోడింపఁబడి చెఱపెట్టఁబడిన వాఁడగుటచే, నంతకుఁ బూర్వము రెండు శతాబ్దములనుండి శత్రుభయంకరులై మహాధీమంతులై పరిపాలనా దక్షులగు మహావీరులకు జన్మస్థాన మైనట్టియు, విద్యానాథాది గీర్వాణ మహా కవులకును, పాల్కురికి సోమనాథ, మారన, మంచన త్రిపురాంతకాది ఆంధ్ర మహాకవులకును రుద్రభట్ట, హరీశ్వర రాఘవాది కర్ణాటక కవీశ్వరులకును నాశ్రయ భూతులైన భాషాపోషకుల కునికిపట్టయినట్టియు, కాకతీయ సామ్రాజ్యము భగ్నము కావలసి వచ్చెను. అప్పుడు ప్రతాపరుద్రునిచే నానా మండలాధికారులుగ నియమింపఁబడిన నాయకులు తమ స్వాతంత్ర్యమును ప్రకటించుటచే నాంధ్ర దేశమున ననేక రాజ్యములు బయలుదేరినవి. అందు ప్రథమమున నాచన సోమనాథాది మహాకవుల కాశ్రయమైనట్టియు, పిదపఁ బదునాఱవ శతాబ్దమున నష్టదిగ్గజములని ప్రసిద్ధిగాంచిన మహాకవులకుఁ బోషకుఁడై ప్రబంధ యుగమునకు మూలమై విద్వద్రాజ శిఖామణియగు కృష్ణదేవరాయని వలన దిగంతవిశ్రాంత కీర్తింబడసినట్టిదియునగు కర్ణాట రాజ్యము మొదటిది. నెల్లూరు మొదలుకొని సింహాచలము వఱకును గల భూమి నాక్రమించుకొని ప్రథమమున నద్దంకియుఁ బిదపఁ గొండవీడును రాజధానులుగ నూఱేండ్లు పరి

ములు బరిపాలించి యెఱ్ఱాప్రగ్గడ, శ్రీనాథాది మహాకవి పోషకులై జగద్విఖ్యాత యశస్కులగు రెడ్డిరాజ్యము రెండవది. ఈ రెడ్డివంశమున జనించిన దేంటివేముఁడు లేక ప్రోలయ వేమారెడ్డి యను నాతఁడు స్వదేశాభిమానమును స్వమతాభిమానమును గలవాఁడగుటచే నాంధ్ర దేశమునకుఁ దురుష్కుల వలనఁ గలిగిన బాధలను దొలఁగించి వైదికమతము నుద్ధరింప నెంచినవాఁడై " తనకునద్దంకి తగురాజధానిగాఁ బరాక్రమంబున బహు భూములాక్రమించి " రెడ్డి రాజ్యమును స్థాపించెను. ఈతఁడు క్రీస్తుశకము 1324 వ సంవత్సరము మొదలు 1350 వఱకును రాజ్య పాలనముఁ జేసియుండెనని శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈతఁడు మిగుల విద్యాపోషకుండును, ఆర్యమత ధర్మములయం దత్యాదరము కలవాఁడునునై యనేకాగ్రహారదానాది సత్కార్యముల నాచరించుచు " సర్వజ్ఞైకపావనుఁడై వెలుఁగొందెను." సకల కళా కోవిదులగు నుభయభాషా కవులచే నిండియుండు నీతని యాస్థానమునఁ బెఱ్ఱాప్రగ్గడయు నాస్థాన కవిగా నుండుటంజేసి యాతని కాలము పదునాల్గవ శతాబ్ది మధ్య భాగంబని మనము నిశ్చయింపవచ్చును.

‘ దురితహరు ప్రబంధ పరమేశ్వరునిఁ జెద’’
ల్వాడనిలయు నాదువంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రగ్గ
డనునుతింతు బ్రహ్మకృపాదరంబె’’

యని విప్రనారాయణ చరిత్రమును రచించిన మల్లన కవి చెప్పియుండుటచే నెఱ్ఱాప్రగ్గడ యింటిపేరు చెదల్వాడ వారని మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇతఁడార్వేలనియో

గి బ్రాహ్మణుఁడు. నివాసస్థలము “పాకనాటిలో (నె ల్లూరుసీమ) నీలకంఠేశ్వర స్థానమై యొసఁక మెసఁగు గుడ్లూ రు. ఆంధ్రభారతమును రచించిన కవిత్రయములో నీతఁ డు కడపటివాఁడు. నన్నయభట్టాంధ్రీకరింపఁగా మిగి లిన యారణ్యపర్వ భాగమును నన్నయ రచించి నట్లుగ నా తని పేరిటనే తెనిగించెను. ఇందుకు నన్నయ యారణ్యప ర్వ రచనచే మతిభ్రమకలవాఁడై మృతినొందెనని యాకాల మునఁ బ్రబలిన వాడుకయే కారణము గావచ్చును. నన్న యభట్టారణ్యపర్వమును సంపూర్ణముగనే యాంధ్రీకరించెన నియు, నడ తిక్కన కాలము వరకు బూర్ణముగ నుండుట చేతనే యాతఁడద్దానిని దెనిఁగింపక, విరాటపర్వమునుండి మొదలు పెట్టెననియుఁ దిక్కనతరువాత నాభాగముత్స న్నమగుటచే నెఱ్ఱాప్రెగ్గడ దానిని పూర్తి చేసెననియుఁ జెప్పుట కలదు. కాని వీరిద్దఱికిని గలయంతరమేఁబది సం వత్సరములకుఁ దక్కువగనే యుండును. ఇంతస్వల్ప కా లముననే యంత ప్రఖ్యాతిఁజెందిన గ్రంథ మొక్కమాఱు గా నుత్సన్నమయినదనుట సంభావ్యము కాదు గావునను,ఎ ఱ్ఱాప్రెగ్గడయుఁ దానుస్వయముగ రచించుటకు భయపడి యేకాఁబోలు దానికర్తృత్వము నన్నయమీఁదనె పెట్టిరచిం చుట చేతను నాభాగమాకాలమునఁ గొఱతపడియే యుం డెనని తెలంపవలసియున్నది. ఈభారతారణ్యపర్వ శేష మును బ్రబంధరీతిని “చతురోక్తిపదంబుల”రచించుటచేతనే యాతనికిఁ “బ్రబంధ పరమేశ్వరుఁడను” బిరుదము కలిగినది విశేషముగ శివభక్తి కలవాఁడగుటచే నీతనికి శంభుదాసుఁ డని బిరుదము కూడ కలదు. ఈవిషయము లితఁడు తానుచి

యించిన "నృసింహ పురాణమున" తిక్కనవలె నొక
స్వప్న వృత్తాంతమును గల్పించి యందు దన తాత తనసభాన
మున నావిర్భావంబు నొంది చెప్పిన ట్లీక్రిందిపద్యములందుఁ
జెప్పియున్నాఁడు.

"ఉన్నత సంపత్ప్రతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తయై
యెన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగ నఖండ్యకీర్తి శో
భోన్నయు మంథరిభాష సుజనోత్సవమొప్పఁగనిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవి నాథులకెక్కిన భక్తిఁ బెంపునన్॥

గిరిశ పదభక్తిరసత
త్పర భావము గలిమి శంభుదాసుఁడనంగా
బరగిన గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెంగన్॥"

ఈ నృసింహ పురాణమింక నీతనిచే రచియింపఁబడిన రామాయణ, హరివంశములవలె నరాంకితము చేయఁబడక అహోబలేశున కంకితము చేయఁబడెను కావుననే దీనినహోబలమాహాత్మ్యమని కూడనందురు. ఈనృసింహ పురాణమునందును, హరివంశమునందును గూడ నీతఁడు నన్నయ తిక్కనల నిద్దరినే పూర్వకవులుగా స్తుతించియున్నాఁడు. ప్రథమమున నీతఁడు వేమభూపాలుని తమ్ముఁడైన యాతని యొద్ద దండనాథుఁడుగనున్న మల్లారెడ్డిచేఁ బోషితుండై పిదప గుణగ్రహణ పారీణుండును, భాషాపోషకుండునగు వేమభూపుని యాస్థానముఁజేరి యాతని గౌరవమునకుం బాత్రుఁడయ్యెననుట క్రిందిపద్యములు నిదర్శనములగుచున్నవి.

సకల భాషా కవిత్వ విశారదుండవు
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి

భవ్యుఁడవు గాన నీవీపుడఁబుగఁగొ
మేనుగిలిగి యుండుదు చెప్పు స.

అని వేమభూపాలుఁడు నెయ్యంపుఁ గోరంబు చేఁ బల్కె
శా. నాతమ్ముండు ఘనుండు మల్లరధనీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిన్ జేపట్టి మాకిచ్చుటన్
జేతో మోద మెలర్ప రామకథ ముజ్జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనుండని యశేషగావ్యామృతస్వాదనన్
కం. భారతపరాంశమని యిం
పారగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుఁగున
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్॥
అని పలికిన నీతఁడును బులకితదేహుండై
ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపినత్రోవ బావనం
బెన్న పరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయమాదిదేవుఁడౌ
వెన్నుని వృత్తమీను గడువేడుకతో ఘనునాయకుండవి
ట్లెన్నియు సంఘటించె మదభీష్టసిద్ధికి రాజపుంగవా॥
అని పల్కి యుత్తరం బొసంగి హరివంశము నాంధ్రీకరింప
మొదలిడెను.

ఈ హరివంశము భారతపరాంశమని బుధులు చె
ప్పుదురు గావున నీవు తెనిఁగింపుమని వేమభూపాలుఁడు
పల్కుటచేతను, ఇది పరాశరాత్మజమునీంద్రుని వాఙ్మ
యమై '' సర్వోత్కృష్టనాయకుఁడగు ‹‹ ఆదిదేవుఁడౌ
వెన్నునివృత్తము''గుట చేతను నీతఁడీగ్రంథమును రచింపఁ
దొడఁగినట్లు కనుపడుచున్నది. కావున నీకృతిపతి కృతి
కాల నీప్రయామునఁ బ్రేరేపించినది హరికథాలాపశ్రవణ,

శబ్దార్థక్లిష్టమైన రూపమున ధర్మైక గ్రంథమగుటయే. మఱియునిది భారతమునకను బంధముగుటచే నిది తెనిఁగించక భారతామ్నాయమాంధ్రీకరణము సంపూర్ణము కాదను తలంపుతో భారతము వలెనే సర్వజన సమాదరణీయంబగు పురాణశైలినే నన్నయ తిక్కనలు చూపిన త్రోవనే యవలంబించి రచించుటకు మొదలుపెట్టెను. ఈ హరివంశము మిక్కిలి రసవంతమై నాతికఠినమై యుండును. చాలవరకీతఁడు మూల కథననుసరించియే తెనిఁగించినను అక్కడక్కడ మూలమునంలి కథలను విడిచియు స్వకల్పనలఁ జేర్చియు నాంధ్రీకరించినాఁడు. పూర్వభాగమునఁ బృథుయయాతి మొదలగువారి చరిత్రలను, వరాహావతారాదుల సంక్షేపకథలను, పిదప శ్రీకృష్ణుని జననము ఆతని బాలక్రీడలు, సాహసకృత్యములు, రాక్షస వధలును వర్ణించి బలరామ కృష్ణులు సాందీపని యొద్ద విద్యాభ్యాసమును జేయుటతో ముగించెను. ఉత్తర భాగమును జరాసంధుని పరాజయముతోఁ బ్రారంభించి రుక్మిణీపరిణయము, నరకాసురవధ, పారిజాతాపహరణము, మధుకైటభాది రాక్షస సంహారము, ఉషానిరుద్ధీయము, బాణాసుర పరాజయము, బలిని పాతాళంబునకుఁ బనుచుట యను విషయములతో సమాప్తినొందించెను.

ఇందీశమంతకమణికథ పూర్వభాగమున నంధకవంశక్రమంబు సంక్షేపంబుగాఁ జెప్పుచు నందు నిఘ్నుని కొడుకులగు ప్రసేన సత్రాజిత్తులం బేర్కొని, యా సత్రాజిత్తుని చారిత్రమును జెప్పు సందర్భమునఁ జెప్పఁబడియె. ఆంధ్రభాగవతంబునఁ జెప్పఁబడిన కథకు నిందలి కథకును విశేషభేదము లేకున్నను పోతనామాత్యుని కథ యాతనికి

సహజంబగు భక్తి రసంబుతో నొప్పారుచున్నవి. సత్రా
జిత్తు భాస్కరదత్తంబగు మణినిఁ గైకొని వచ్చినాఁడుఁ బో
గుల్వ్రానిఁ జూచి విస్మయంబంద కమలనాభుని పాలికిం బో
యి "దేవా దర్శించుటకై తావచ్చుచున్నవాఁడు లోనుండి
డి" యని పల్కినన్ హరివంశకర్త చెప్పగా, పోతనః నా
రాయణ దామోదర........" అనిస్తుతించి యాదవ
వంశమున నావిర్భవించిన జగత్ప్రాణాంతకుడగు నిన్నుఁ జూ
డ గోరియో నీరజగర్భుఁడో వచ్చుచున్నాడ"ని చెప్పించెను
మఱియు జాంబవంతుండు కృష్ణుని విష్ణునిగా నెఱింగిన వి
ధము పోతన దీర్ఘస్తుతియుఁ గృష్ణునివలన సత్రాజిత్తు మణిఁగై
కొనిలేనిది వైఁ బెట్టితి హరి దైవని" హరివంశమున కనుపడవలెఁ
గాక 'పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి ప
రమాత్మునిపై బాపముగలదని నొడివిన పాపాత్ముని బాపము
నకుఁ బారముగలదే" ఇత్యాదికముచే నాతఁడు పొందిన
పశ్చాత్తాపవర్ణనమును నీతని హరిభక్తిని వెల్లడించుచున్నవి.
భాగవత కథయందీమణి యొక బాలికకు దుర్దశ్యనీయకేళి
కందుకంబుగా వేలంగట్టిన దానిని హరిచూచి హరింపని
శ్చయించెననియు, హరివంశ కథయందు బలంబున వచ్చి
జాంబవత్పుత్రిక ధాత్రియొకర్తు గర్జనంబునయందు మ
హోదారంబగు నీరత్నహస్తాంబుజమును వినిలోనికింజనెనని
యు నున్నది. మఱియు హరివంశమున మణికై శతధన్వుని
వధవ్యర్థంబయ్యెనన్న కృష్ణుని పలుకు బలరామునకు శంకా
స్పదంబగుటచే నాతఁడు నిష్ఠురోక్తులువలికి యేకాకియై మి
థిలకుఁ జనెనని చెప్పఁబడియుండ, భాగవతంబుననిది శంకా
కారణముగా సూచింపఁబడక, శతధన్వుని వధ మిథిలా స

ప్రగణ మార్గమునందించుక భేదములేక పోయెను. నన్నయభట్టుం తకుఁబూర్వము సంస్కారములేక సులక్షణ విరహితమై యున్న యాంధ్రవాణికి సర్వలక్షణ సంపన్నయగు సంస్కృత భాషాసంయోగముఁ గల్పించి తత్సహాయముఁ గవి సింహాసనము నెక్కించి, యాంధ్రవాగనుశాసకుఁడై శాశ్వతకీర్తి నార్జించెను. ఆంధ్రమునకు దేవభాషచే మెఱుంగు వెట్టి దివ్యమగు తేజముతో దానిఁ బ్రకాశింపఁ జేసినవాఁడు. భట్టారకునకుఁ బూర్వమున గల యాంధ్రకవిత కింత తేజస్సున్నట్లు కనుపడదు. ఈతని కవితయందు బహుళంబులగు సంస్కృతపదంబుల మధ్యఁ గొన్ని తెలుఁగు పదములఁ గూర్చుటచే నవి యాంధ్రులకెంతసొంపు నాపాదించుచుండును. ఇఁక తిక్కనయో, యాంధ్రభాషకుఁ గల మెఱుంగులును, సొంపులను దీపింపఁజేసి దాని నిజవిలాసములను జూపినాఁడు. సంస్కృత పదముల సహాయములేకయే కొన్ని యచ్చ తెనుఁగు పదములకూర్పు నేర్పుచేఁ సంపుష్టిలఁ జేయు సామర్థ్య మీతనికి గలదు. తిక్కన చేతిలో నాంధ్రవాణి విశేషముగ నెఱుసొమ్ము లక్కఱలేకయే సహజ సౌందర్యముచే బ్రకాశించు నంతటి ప్రౌఢిఁ గాంచినది. ఈతని యాలయమున నీమె తన సహజశోభలన్నియు వెలువఱచి యొకవిధమగు స్వాతంత్ర్యమును సంపాదించుకొనెనని చెప్పవచ్చును. ఇప్పుడు "కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం"— సహజముగ మధురమైన యాకారము (సౌందర్యము) కలవారికి ఏవస్తువలంకారముకాదు — అని కాళిదాసు చెప్పినట్లుగా, సంస్కృత పదములకంటె రెండు మూఁడు రెట్లధికముగ సహజ మాధుర్యముగల తెలుఁగుం

దములమధ్య నా సంస్కృత పదములు మండన (అలంకార) స్థానీయములై తమసుందరత్వమున బ్రకాశించినవి. నన్నయ సహజముగ నాంధ్రదేశీయుడు కాకుండుట వలననో, యాతనికి సంస్కృత భాషాభిమానము హెచ్చయి యుండుట వలననో, యాదినములకు దగిన సంస్కారము లేని కారణమున నప్పటి భాషపటువగు శైలి కలవడకుండుటచేతనో, నన్నయ సంస్కృతము నెక్కుడుగా గలిపియున్నాడు. తిక్కన సహజముగ నాంధ్రదేశీయుడు. ఉభయభాషల యందసమాన ప్రజ్ఞ కలవాడు. కావున నన్నయకంటె నీతకి దెనుగు ప్రయోగమున నెక్కుడభిమానము కలిగినది. తెనుగు పదముల కూర్పునందధిక చాతుర్యము కలదు. తెలుగున జాతీయప్రయోగ సౌలభ్య మితని కలవడినట్లితని కలవడలేదు. కావుననే యితడాంధ్రభాష అన్యభాషాశ్రయములేకయే యాసొంపుల నన్నిటిని స్వశక్తిచేత సమకూర్చుకొనగలదని సూచించుచు స్వకీయభాషా స్వాతంత్ర్యమును బ్రకటించినాడని చెప్పవచ్చును

ఇక రెండవ ప్రశ్న. కవితా విషయమున నన్నయ తిక్కనలే గురువులని చెప్పబడినది గదా; వారు చూపిన త్రోవయే పావనమైనదనియు నీతడు చెప్పియున్నాడు. ఈ గురువులలో నొకరు సంస్కృతముతోడి విశేష సంబంధము వలన నీభాషకు గలిగిన గౌరవము, మాధుర్యము, గాంభీర్యము మొదలగు గుణములను జూపియు, మఱియొకరు సంబంధము లేకయే స్వభాషా పదములకు గల లాలిత్యము, రసోద్బోధక శక్తి మొదలగు గుణముల జూపియు నాంధ్ర

కవిత్రయమందు రెండు త్రోవలు కన్పించిరి. రెండును దేనికదే యతిరమ్యంబులగు త్రోవలె. కావున వీరిద్దరి కవితారీతుల ననుకరించుటకుగా నీతఁడు సంస్కృతాంధ్రముల దాదాపు సమభాగములఁ గలిపినాఁడు. ఆంగ్లవాఙ్మయమున మిల్టన్ Milton మహాకవిని గూర్చి డ్రైడెన్ Dryden అను కవీశ్వరుఁడు చెప్పిన

*"Three Poets three distant ages born*
*Greece Italy, and England did adorn*
*The first in loftiness of thought surpassed*
*The second in majesty in both the last.*
*The force of Nature could no further go*
*To make a third she joined the other two*

రీతి నాంధ్ర కవితా విషయమునఁ బ్రామాణికాగ్రగణ్యులగు కవిత్రయము వారిలో నన్నయ తిక్కనలు తీసినత్రోవలు రెండు సత్కృతములై యుండగా, నామహాకవుల సమాంశములచే నీకవిత్రయమున మూఁడవవాఁడగు నెఱ్ఱాప్రెగడయు, వారి కవితారీతుల సమ్మేళనముచే నీతని కవితా రీతియు నేర్పడియెనని మనము తలంపవచ్చును. కాన నీతఁడు సహజముగఁ దెలుఁగు దేశము వాఁడగుటచేఁ గాఁబోలు తిక్కన మార్గమునందధికాదర మున్నట్లు గన్పడును. నృసింహపురాణము నందును, హరివంశమునందు నీతఁడు వాడిన తెలుఁగు పదముల బాహుళ్యమే యిందుకు నిదర్శన మగుచున్నది.

ఈ హరివంశమందలి యుత్తరభాగ విభజనలో నించు మించుగా సమకాలికుఁడై, కర్ణాట రాజ్యమున బుక్కరాయల యాస్థాన కవియగు నాచనసోమనాధుఁడు "ఉత్తర హరివంశము" పేరుతోఁ దెనిఁగించెను. ఎఱ్ఱాప్రెగడ హరివంశము పూర్ణముగా నుండలేదను నభిప్రాయముతో నీతఁడీయుత్తర హరివంశమును రచియించెనని చెప్పుదురు. ఏదెట్లయినను సోముని గ్రంధ మెఱ్ఱాప్రెగడ గ్రంథము కంటె మిగుల ప్రౌఢమైన దనుటకు సందియము లేదు. కాని యదిప్రబంధశైలిని ప్రౌఢముగ రచింపబడిన దగుటచే హరివంశము వలె సర్వజనైక వేద్యముకాదు. ఎఱ్ఱాప్రెగడ ప్రబంధపరమేశ్వరుఁడని బిరుదు వహించి, తన హరివంశము ప్రబంధమని చెప్పినను, దీనికంటె సోముని గ్రంథమే ప్రబంధరీతులను గైగొనియున్నదని తలంపవలయును. ఎఱ్ఱాప్రెగడ హరివంశమును" భారత వంశమగుటచే నది సర్వజన సమాదరణీయమగునటుల మృదుమధురములగు రచనలతోఁ బురాణశైలిని రచియించి భారతామ్నాయమును సంపూర్ణముగఁ దెనుఁగులోనికిఁ దెచ్చిన వాఁడయ్యెను. సోముని పని యిది కాదు. హరివంశమందలి కథాభాగముల నే తీసికొని యంతకంటె రసవత్తరంబుగ విశేష కల్పనలఁ గూర్చి రచియించి, తన ప్రతిభా విశేషమును బ్రకటించు నొక విధమైన యపూర్వంబగు స్వతంత్ర గ్రంధమును వెలువడఁ జేయవలయునని యేయాతని యాశయము. కావున గ్రంథ రచనోద్దేశమున నే వీరికిరువురకును గొంత భేదముగలదు. స్వాభిప్రాయము ననుసరించియే సోముఁడు తాను రచింపఁదలఁచిన గ్రంధమునకు వలయు సామగ్రి సంగ్రహము నొనర్చెను

XIII

సారాంశము నంతను మరల నీతఁడు పరిగ్రహింపఁ దలంచుకో లేదు. కావుననే పూర్వభాగమునంతయు వదలివేసెను. ఉత్తరభాగమునందైనఁ గృష్ణునిచర్యలలో రసవంతములను, కేవల కల్పనా చాతుర్యమును, వర్ణనా ప్రాగల్భ్యమును నాటకమునకుపపన్నముమాత్రమే గ్రహించి స్వతంత్రముగ నొక ప్రబంధమును రచించెను. ఎఱ్ఱాప్రెగడ హరివంశ పురాణమునంతను, నంతకుఁబూర్వము నన్నయ తిక్కనలు భారతమునఁ దెనిగించిన రీతినే సర్వజన సమాదరణీయముగునట్లు రచించి భారతామ్నాయమును సంపూర్ణము చేసి యాంధ్రభాషయందు నెలకొల్పెను. నన్నయచే మొదలుపెట్టఁబడిన భారతాంధ్రీకరణము రెండువందల యేండ్లకీ మహాకవి కాలమున సంపూర్తియగుట తటస్థించినది. ఇట్లార్యమతాభిమానుల కత్యంతాదరణీయములగు భారత రామాయణము లీతనికాలమున నాంధ్రమున సంపూర్ణములగుటచేత నన్నయ తిక్కనల యంశమున నావిర్భవించిన యీతఁడు వారిరువురు ప్రారంభించిన కార్యములను కొనసాగించి యాంధ్రావళి కత్యంతామోదమును గూర్చువాఁడయ్యెను.



పుచ్చి యాతని యఱుతం బెట్టి వరంబు వేఁడుమని
పలికిన.

క. అతఁ డమ్మణి యూగియ యాభి
మతఫలముగ నడుగుటయును ♦ మార్తాండుఁడున
ట్లు తగంగ నిచ్చి యంత
ర్హితుఁడయినఁ బ్రమోదమూర్తి ♦ నెపకం బెసఁగన్.

వ. మగిడి సత్రాజిత్తు ద్వారకానగరంబునకేగుదేరంగని
యెల్లవారును కృష్ణసహస్రాంశు సమ్మోహ సంభ్రమంబులం
గమలనాభుపాలికిం బోయి.

క. దేవర దర్శించుటకై
తావచ్చుచు నున్నవాఁడు ♦ తపనుండిదె తే
జోవిసర మెసఁగ నవనిని
యావిభు డల్లనగి వార ♦ లందఱతోడన్.

వ అతని వర్ణప్రసాదలబ్ధరత్నుండైన సత్రాజిత్తుంగా
నెఱింగించె నట్లు సత్కరించి సరోజినీబాంధవ పఖుం
డు సుఖంబున నుండునంత.

ఉ. నిచ్చలు నమ్మణి వి
సర్జల కాంచన గర్భ భారముల్
పొచ్చము లేక యెన్నఁడు ప్రి
భూతనుఁగాఁ గురియున్ ధరిత్రిఁ దాఁ
నెచ్చట నుండె నచ్చటికి
చేయుపసర్గము శోభయంబు నే
యచ్చిరయున్ జనింపక స
మంచిత సుస్థితినిచ్చు నిచ్చలున్.

మ. అది దామోదరుఁ డుగ్రసేనునకు నీ
య్యం జేర్పఁగాఁ గజ్జమున్
మది నూహించుచు నుండఁ గృష్ణుఁ డడుగన్
మానోచితుం డీ విభుం
డిది యీకుండను రాదు కల్గొరులకే నె
ట్లిత్తు నంచుం గోరిన్
బదను ధ్యానము సేయుచుం దలఁచె స
త్రాజిత్తుఁ డెల్లప్పుడున్.

వ. కృష్ణుండును గులంబులోనం గలహంబు పుట్టునని త
లంచి తాను శక్తుండయ్యును గొననొల్లక యాద్య
వరిసంగంబులం గోరి, సన్నాహం బలుకుచుండఁ
జూదంబులందును నెఱింగి యుండుదురిట్లుండ సత్రా
జిత్తు జనార్దనునివలన శంకించి యమ్మాణిక్యంబు ప్ర
సేనునకిచ్చె నదియును శుచియైనవాఁడు దాల్చిన నం
దనగుణంబులు మాపక ప్రాణాపద నొసఁగు నత్తెఱం
గయ్యిరువురు నెఱుంగ రంత.

సీ. ఆ ప్రసేనుఁడు తురగారూఢుఁడై లీల
విపిన దుర్గంబుల ♦ వేఁటలాడ
నొకసింహ ముగ్రమై ♦ యొత్తికి గుఱ్ఱమ్ము నా
తని జంపి బలుకండ ♦ యనుతలంపు
గ్రమ్మ రత్నము నోరఁ ♦ గబళించు నంతలో
నేతెంచి మృగపతి ♦ నెలుఁగు ఱేఁడు
జాంబవంతుఁడు మహా ♦ సత్త్వుండు వధియించి
యమ్మణి గైకొని ♦ సమ్మదమునఁ

భృంగిన్ గణంబు జేకవిం
శతసంఖ్యాకలితాహముల్ హరికి బు
త్రుసాస్వామికిం జెల్లఁగన్.

వ. యాదవేశ్వరుని యనుచరులచ్చట నెనిమిది దివసంబు
లు గాచికొనియుండి బలదేవానుజుఁడు బిలాంతరగం
బు వెలువడఁడయ్యెఁ బ్రాణంబులతోనున్న నివా
శ్శైల తడయుననుచుం జేటుచొచ్చి మగిడిపోయి కృ
ష్ణుండు నిహతుండయ్యెనని చెప్పిన.

క. శోకించి చుట్టములు పర
లోకవిధులు నడపి నిర్వ ◆ లోపతవిహితా
నేకతిల పిండ దానము
లాకృష్ణున కటనొనర్చి ◆ నాహ్వాయనమున్.

వ. దానంజేసి యాతండు పత్వహవిం బొందక యొప్పటి
యట్లయుండె జాంబవంతుండు నిరాహారత్వంబు క
తనను బ్రబల సంప్రహార భేదంబులవలననుబలహీనుం
డైయోటువడి యద్దేవునకుసః నప్రణామంబొనర్చి.

మ. సురగంధర్వ భుజంగముద్యచర ర
క్షోముఖ్యులు నీపదసం
బరిభావంబొనరింప నోపరని మ
ద్భావంబునం దోఁచె న
వ్వరు తిర్యగ్భవులైన మాదృశులు దే
వా నిన్ను మత్స్వామి దా
శరథిం బ్రాప్తపునస్సముద్భవునిఁగా
శంకించెదం జెప్పఁగే.

క. అనిన నగుచు నబ్జభుఁడా
యన కాత్మావతగణంబు నఖిలము నెఱిఁగిం
చిన వాఁడు భక్తసఖు
గ్రవలు దగనొసర్చి యధిక సమ్మోదమునన్.

వ. తదీయ కరతలస్పర్శనంబున నాయాస సమాశ్రమంబు
నుజ్జగించి ఋక్షేశ్వరుండు.

క. తనకూఁతు జాంబవతి నాఁ
జనుకన్నియఁ దెచ్చి యిచ్చె సన్నుతహాత వ
న్వనకేతనునకు నతఁడును
వనజాక్షిఁ బరిగ్రహించె వాంఛదొలర్పన్.

## శ్రీకృష్ణుఁడు జాంబవతిం బరిగ్రహించి నిజ పురంబునకు వచ్చుట.

వ. అట్లు కన్యారత్నంబు నివేదించిన యనంతరంబ శ్యా
మంతకరత్నంబును సమర్పించినం బ్రీతుని చేతిదగో
వందగదయినను బరివాదపరిహారార్థం బయ్యక్షవిదుం
డుగ్గైకొని చరితార్థుండై జాంబవతిందోడ్కొని పురం
బున కరుగుదెంచెను.

ఉ. పౌరులు బంధుమిత్రులును
భాగ్యఫలంబులు నేఁడు మాకు నిం
డారఁగఁ బండె నచ్యుతుఁ
డుపాయ మొకింతయు లేక యిమ్మెయిం
జేరె జగంబు లన్నియును
దీకుటఁ జేరితమంచు సమ్మన

కౌనకా కృష్ణునిపొమ్ముఁ జేసి ఖలుఁడై
కూఁతున్ సహింపంగ వ
చ్చునె యూహాసి విచారమేమిటికిఁ దు
చ్ఛున్ వీనిఁదుప్రింగించి యెం
దు నలభ్యంబగు మానికంబుగొని సం
తోషింత మంత్రతిన్.

చ. ఎఱుఁగనివాఁడ పోలె వారి
యివ్విధి యూరకమాటనేని లే
కుఱక మనంబులోనఁ బగ
యూఁడుచందమ్మయెనఁ బేర్చి యం
దఱమును నొక్కఁడై కలసి
దవ్వగఁబాయుద మెవ్వ రెక్కుడే
నోఁఱగిన వారికెల్లఁ దగ
నోర్తము నిశ్చయమిట్లు దీనికిన్.

వ. అనిననతండు నవ్వాక్యంబున కియ్యకొనియె జనార్దనుం
డు జతుగృహదాహంబునఁ గుంతీనందనులు మృంది
రనువార్తవిని తాను బరమార్థవేది యయ్యును దు
ర్యోధనుబుద్ధికి నిజంబు గాఁ దోఁచుటకై వారణావతం
బునకుఁ బోవుటయు రంధ్రాన్వేషి యగుటం జేసి.

శతధన్వుఁడు సత్రాజిత్తుం జంపి శ్యమంతకమణి
నపహరించుట.

తే. అలఘుచరితు సత్రాజిత్తు • నధమరాత్రి
నిప్పుడై యున్న వధియించి • లుబ్ధగర్వుఁ

డైన శతధన్వుఁడతని య ♦ నక్రూర్యాదివర్య
వినుత మాణిక్యరాజంబు ♦ గొనుచుఁబోయె.

సీ. తండ్రిఁ జంపినఁ గడుఁ ♦ దఱికి యత్యంతవే
గముగల గుఱ్ఱముల్ ♦ గట్టినట్టి
తేరెక్కి చెచ్చెర ♦ వారణావతమున
కరిగి యాతెఱఁగు బా ♦ రాయణునకు
సర్వంబు నెఱిఁగించె ♦ సత్యభామాదేవి
వాసుదేవుండు న ♦ వ్వామనయన
మనసులో నున్న య ♦ మ్మలికమ్ము మానెడు
పంతంబుమాటలో ♦ కింతకొఱఁత
పడకయుండంగఁ బలికి య ♦ ప్పడఁతిఁగొనుచుఁ
బురికిఁ జనుదెంచి యేకాంత ♦ మునహలాంకు
తోడఁ దలపోసి శతధన్వుఁ ♦ దునిమి యతని
చేతిరత్నంబు గొనుటని ♦ సేయఁదలఁచె.

వ. అట్లయ్యిరువురుఁగూడి కీడొనర్ప నుద్యోగించు తెరువ యెఱింగి శతధన్వుండు వారితోడి పోరునకుఁ బెనుప్రా పైనిలుచునట్లు కృతవర్మ నడుగంబోయిన నతండియ్య కొనక బలదేవ వాసుదేవుల దెస విరోధంబునకుఁ దానోర్వమి దెలియం బలికె నక్రూరుం గలసికొను వాఁ డైన నతండు.

మ. అనురీహారమ్యమృణాళహంసను మహేం
ద్రాంతఃపురీ కర్ణ చ
త్రిపమున్నీలన మూలశిల్ప కుమతధ్వాం
తార్కబింబంబుదు

ప్రియవహం బెవ్వనిచక్రి మట్టిహారికిం
బ్రిత్యధికారై నిల్వఁగా
వసమే యెంతటివానికిన్ వెఱతు న
న్నైర్గస్వ్యాఖ్యం బూనఁగన్.

వ. ఏనతని శరణాభిలాషకుండ దోషాచరణంబునకునెట్లు
గడంగుదు వెడంగనయియున్న మీతలంపునంగలసితి
నవియున్నియు నప్రియోజనంబు లనిన శతధన్వుండ
శ్లేని నాకునిక్కడ నన్యుండు రక్షకుండు లేఁడు తొ
లఁగిపోయెద నీవీయలభ్యరత్నంబు డాఁచ వలయుఁ
బ్రాణంబుపైవచ్చునంతటి పోరామియందును నెవ్వ
రికి నెఱింగింపకుండునది యని యొడంబఱిచి యతని
చేతికిచ్చి యాపార్శ్వ పురంబువెడలి పూర్వోత్తరది
శాభిముఖుండై.

శతధన్వుఁడు కృష్ణునకు వెఱచి తురగారూఢుండై
పాఱిపోవుట.

క. తనకు నొకనాట శతయో
జనములు చనువ్రాదయగతి ల ♦ పత్తురగనితం
బినికలిమి దానినెక్కి న
వనసమగతిఁ జనియె మనసు ♦ వడఁకఁగభీతిన్.

చ. అంతనెఱింగి శౌరియు ప
హాగ్రజుఁడై రథమెక్కి యయ్యె ద
శాగ్రింతుని వెన్నడింపగులఁ
గాఁ దనపోయెడు దవ్వుపోయి తా

నంతటఁ బోవలేక నృపతిఁ
బొందె హయాంగన భోజవర్యుఁడు
భ్రాంతతఁ బాదచారియయి
పాఱెః దేహపురంబు చేరువన్.

క. కనుఁగొని కృష్ణుఁడు బలదే
వునకిల్లను హయములలసెఁ ద ◆ వులు గడు వెసమైఁ
జననిచ్చుట గాఘన నీ
వనఘా కొనిరమ్ము రథము ◆ నల్లన వెనుకన్.

తే. విగతవాహనుఁడైన య ◆ వ్విమతుఁడోపు
కొలఁది మెల్లనఁ బాఱెడుఁ ◆ గూడముట్టి
పట్టికొనియేదననివ న ◆ బ్బలుఁడు నిల్లు
కాక యన డిగ్గనుఱికి యా ◆ కంసరిపుఁడు.

క. కొంతదడ వరిగి వెనుకొని
యంతటఁ గడునలిగి యాతఁ ◆ డా శతధను న
త్యంతక్రోధంబున మది
శాంతింపక తునియవైచెఁ ◆ జక్రము చేతన్.

వ. ఇట్లు తలద్రుంచి శతధన్వుం జేరఁబోయి.

క. తలయును జీరయు నోరు మొ
దలుగా శోధించి చూచి ◆ తత్తనువున న
వ్విలసిత రత్నము గానఁడ
హలధరుఁడును గూడవచ్చె ◆ నంతటిలోనన్.

వ. ఆతండవ్యర్థం బతనికిం జెప్పి శతధన్వువధంబు వితథం
బయ్యెనను పలుకుపలికిన నదిబొంకను తలంపునఁ గ
టకటంబడి బలరాము.

తే. అకట ప్రేమయెట్టిగియొ నీ ♦ యగ్రజాఁడు
నిస్పృగో యింతమాత్రకు ♦ నిష్ఠురుఁడయ్యెఁ
బలుఁ డేటికి నీతోడ ♦ భ్రాతృధర్మ
మింకనింతియచాలు నీ ♦ యిచ్ఛఁజనుము.

వ. అని యతని శపథవాక్యంబులు విశ్వసింపక సాంత్వ
నంబులు గైకొనక యిమ్మాయలేల నెఱుంగనియట్టియొ
యుడుగుమని పోసి యొక్కరుండును మిథిలాపురం
బునకుంజని జనకరాజుచేత సత్కృతుండై తత్పదవం
బుననుండె నెన్నుండును శైబ్యసుగ్రీవమేఘపుష్పవ
లాహకంబు లను రథ్యంబులుగల యా దివ్యరథంబు
తోడమగిడి ద్వారవతీపురంబునకు వచ్చెనక్కడ.

క. వైదేహపురనివాసు మ
హాగ్రమసత్త్వ సాత్త్వ ♦ తాగ్రణి ఘనుదా
మోదరపూర్వ్యుఁ గానం
గా దుర్యోధనుఁడువచ్చి ♦ కడువినయమునన్.

వ. సవిశేషార్చనాతోషితుంగావించి యతం డాచార్యుం
డుగా గదాకౌశలంబంతయుం గూడిముట్ట నభ్యసించె
నంతఁ గొంతకాలంబునకు సుగ్రీసేనాది యాదవవృ
ద్ధులు రత్నంబు కృష్ణునకుం జేపడమి లెస్సగా నెఱింగి
పోయిబలభద్రునకవ్విధంబు దెలిపి యతనిందోడ్కొ
నిచనుదెంచి రనంతరంబ.

సీ. అక్రూరుఁడమ్మెయి ♦ నమ్మహారత్నంబు
దనకువచ్చిన నను ♦ దినముగుఱియు
పసిఁడియు మణులు న ♦ ల్పంబు సాత్మప్రభా

గమునకుఁ గొనక దా ♦ నములు ధర్మ
ములు హితంబులు బంధు ♦ పూజనంబులునార్జి
తములుగజరపుచుఁ ♦ దనరి యొందు
నతులితంబై దాన ♦ పతియను పేరుపరి
ఖ్యాతినొందఁగ నిత్య ♦ యాజనమొకఁడు
కృత్యముగ నిష్ఠతోడ దీ ♦ క్షించియుండె
నలువదియు రెండునేఁడు లి ♦ తెలఁగుతోడ
నెడపకెప్పుడును మారియు ♦ నడఁగె నలుపు
లుడిగె భద్రింబు పతికల్లు ♦ చుండెనుర్వి.

అక్రూరుఁడు విడిచిపోవుటవలన ద్వారకయం
దుత్పాతంబులు పుట్టుట.

వ. అనఘుమ నొక్కతటి దదీయబాంధవులగు భోజులు
శత్రుఘ్నుండను యాదవు వధియించిన.

తే. కలఁకపుట్టె యాదవులలో ♦ నిలువననువు
గాక తానుజాట్టలుఁ దొలఁ ♦ గంగఁ జనియె
నమ్మహాత్ముఁ డతనిపోక ♦ యాదిగాఁగఁ
బుట్టె బహుదోపములు యదు ♦ పురమునందు.

వ. అట్టియనావృష్టిమారికాగ్ని వ్యాధాద్యుపద్రవంబులు
మాచి వృష్టిప్రముఖులు దమలోనం జింతించునెడ
వను దేవనందనుండు

క. మున్నొన్నఁడు లేవొక్కట
యున్నయునికిఁ బెక్కుకీడు ♦ లుగ్రమ్ముగ ను
త్పన్నములై మానక యి
ట్లున్న విధమునకు నిమిత్త ♦ మూహింపఁ దగున్.

వ. ఎయ్యదియేని నొక్కటి లేక యిట్లేల యగుననిన నంద
నుండును కులవృద్ధుండతని కిట్లనియె.

క. జననుత విను మక్రూరుని
జనకుండు శ్వఫల్కుఁడున్న ♦ జనపదమున సం
జనితంబులుగా వెన్నఁడు
ననుపమ దుర్భిక్ష మారి ♦ కాగ్నిభయంబుల్.

వ. కాశీశ్వరు దేశంబున ననగ్రహపీడ పాడమినం బెద్ద
లు సెప్ప నతండు శ్వఫల్కుం బ్రార్థించి తోడ్కొని
పోయి యద్దురితంబుఁ బాపికొనియెఁ దొల్లి కాశ్యప
త్ని గర్భిణియై సముచిత సమయంబునఁ బ్రసవింపక
పండ్రెండేండ్లు చూలు మోచిన వచ్చెరువునొంది య
వ్విభుండు నిజపరిభావంబునఁ దద్గర్భంబు గూఁతుగా
నెఱింగి తల్లీ మాతల్లికిం గ్లేశంబు సేయక వెడలుము భ
వదీయపదనావలోకనంబున నన్నుఁ గృతార్థుం జేయవ
లవదే యనినం గడుపులోనుండి తండ్రిం బేర్కొని.

క. అనుదినము నేఁడాదిగ
ననఘా యొక్కొక్క మొదవు ♦ నవనిసురున కి
చ్చిన నింక వత్సరత్రయ
మున కేను జనింతుఁ జేయు ♦ మ మదీప్సితమున్.

వ. అనిన నట్లకాక యని యావ్యాపుస్థానంబునడపనకా
లంబునం గన్నియ పుట్టి గోప్రదాన ప్రభూత యగు
టం జేసి గాందినియను పేరుగాంచి క్రమంబునం బెరి
గి పెండ్లిప్రాయంబున నున్నదిగావున నన్నాతినన్న
రనాథుండు పరమోపకారియైన యాశ్వఫల్కునకు నొ

రొడపడకయుండ సలిపెదం ♦ నింతవ్యయము
సేయునే మెఱుఁగ నిపిరి ♦ చెందె నెంచు.

వ. అని యూహించి సమస్త యదువృష్ణి సమక్షంబున
నొండుకార్యంబు పేర నతనిం బిలిపించి.

క. ఆపనికిఁదగిన సరసా
లాపంబులఁ గొంత సేపు ♦ లాలితమృదు గో
ష్ఠీ పరిణతుఁడై పదపడి
యాపురుషోత్తముఁడు నగుచు ♦ నబ్భోజవిభున్.

వ. దానపతీ యని సంబోధించి యిట్లన నిట్లనియె.

చ. సకల జగంబులందుఁ గను
సారము నాఁదగు నుజ్జ్వలశ్యమం
తకమణి నీకు నిచ్చె శత
ధన్వుఁడు నీవును దాఁచినాఁడ వి
య్యది టిలకగ్ర్య మూర్తిగల
యంతటికిన్ హితమేను నాత్మ దీ
నికిఁ గడుసంతసిల్లితిని
నిక్క మెఱుంగుదు నింతయొప్పదున్.

క. నీయొద్ద నుండుటయు విను
మాయర్థంబగుటఁజేసి ♦ మదనెఱిఁగియు నొం
డేయాదియును బలుకము భవ
దీయగుణత్వంబు బహుళము ♦ తిక్షమమగుటన్.

వ. ఈరాహిణేయుండు రత్నవిషయంబైన యవిశ్వాసం
బువలన మాదెసం బ్రసన్నుండు గాకుండు నట్టిదు

సీ. ఆ దేవుఁ డిడె నాకుఁ ♦ బద్మనాభునకును
బొత్తులసొమ్మను ♦ బుద్ధిచేసె
సత్యభామ మదీయ ♦ జనకుని పడసిన
యాధనం బనుఁజేరు ♦ నని తలంచె
నగరింబోఁ బ్రియురాలి ♦ నాత్మఁజూడక కృష్ణుఁ
డొకింతవడి కోర్కె ♦ మదెలకొనియెం
సకలయాదవులును ♦ సస్పృహాలోకన
స్మేరపిస్మిత రస ♦ స్తిమితులైరి
వృష్ణివరు డంత వాఁజ ♦ వీరవరున
కనియె ననఘ యీరత్నంబు ♦ నాత్మసు
కన్నచుట్టాలకును నిది ♦ యింతనూప
వలదె నింకేయ నాద్రైన ♦ వాంఛితంబు.

వ దీనికిం దాలవ్యాజుండును నేనును సత్యభామయు న
న్యాల మన్యులకుం బనిగాదు సకలకాలకుములును సం
భృతబ్రహ్మచర్యులును నగు సుజనులచేత ధార్యమా
ణంబై యిమ్మాణిక్యంబు నిజప్రభావంబుఁ జూపుం
గావున నేమె ల్లాగము నింతనియమంబున కోర్వము
సర్వగుణసంశుద్ధభావుండవు నీవే తదీయధారణయో
గ్యుండవు నీకయిచ్చితిననిన నక్రూరుండయ్యె సంతసిల్లి.

క. ఆరత్నము గైకొని యా
కూర్మింపక మెఱలు గాఁగఁ ♦ గొంకక నమలం
కారముగ నయలు మెఱసి యా
దారత దేజంబుమిగిలె ♦ దపనుఁడ పోలెన్.

తే. జలజనాభు మిధ్యాభిశం ◆ సనః ముక్తి
రైనయిక్కథ చదివిన ◆ వనుదినంబు
వినినఁ దలఁచిన నడిలేక ◆ జనులుసర్వ
దోషరహితులై పొందుచుం ◆ దుఃఖుభంబు.

---

శుభమస్తు.

# హరివంశము

## అర్థములు.

---

(1) విమలచారిత్రము—యోగ్యమగువర్తన, త్రిభువనమిత్రుఁడు=మూఁడులోకములకు హితుఁడు—సూర్యుఁడు (లోకబాంధవుఁడు=సూర్యుఁడు), అమిత్రధ్వంసీ=శత్రువులను నశింపఁజేయువాఁడా! (ఇత్యాది కృతికర్తయగు వేమభూపాలునకు సంబోధన)—శ. అలం. వృత్త్యనుప్రాసము

(2) మూర్త్యంతరము=మూర్తి+అంతరము. మరియొకరూపము, (దేశాంతరము, రాజాంతరము) వెడగ్రభాగంబునన్= అతనియెదుటను, ప్రణతుండై = నమస్కరించినవాఁడై.

(3) నభమున్=ఆకాశము, దుర్లోకస్ఫుటమూర్తిన్= చూడశక్యముగాని విస్తారమైన రూపముతో.

(4) కంఠావలంబియైనన్ =కంఠమునందు వ్రేలాడుచున్నదగుటచే, అనుటయున్ =అనినతోడనే, (వ్యా. వి. ము, పూర్వకంబగుభావార్థకములకానంతర్యార్థకమగును). అటుతన్ = మెడయందు.

(5) ఎసకంబెసఁగన్=అతిశయింపఁగా.

(7) తేజోనివహము=కాంతిసమూహము.

(8) అర్కప్రసి...రత్నుండు=సూర్యునియొక్క యనుగ్రహముచేఁ బొందఁబడిన రత్నముగలవాఁడు, సరోజ ...సఖుండు=తామరకుబంధువగు సూర్యునకు స్నేహితుఁడు.

(9) ఇందుస్యమంతకమణి ప్రభావమువర్ణింపఁబడినది. ఘనిర్మల...భారముల్=స్వచ్ఛమైనబంగారముయొక్కయు, మణులయొక్కయు, బారువులు. (Candy—Measure of 20 Maunds) సాచ్ఛము=తక్కువ, ప్రభూతము గాన్=విస్తారముగా, ఉపసర్గము=ఉత్పాతము (తోకచుక్క మొదలగునవి), అచ్చిక=లోభము, ఇచ్చమైన్=ఇష్టముతో.

(10) మానోచితుండు—(పూజార్హుఁడు) ఇభ్యుండు, కృష్ణుండు, అడుగన్=అడుగఁగాన్, పోరిన్=మాటిమాటికి, తిదనుధ్యానము=దానినిగూర్చిచింత, తలఁకున్=భయపడును.

(11) సన్నవారన్=మెల్లఁగాన్.

(12) విపిన దుర్గంబులన్=చొరరాని యడవులందున్, మహాసత్త్వుఁడు-మిక్కిలిబలముగలవాఁడు, మృగయాతత్పరుఁడై=వేఁటయందాసక్తిగలవాఁడై, తెగిరో=సాహసించిరో

(13) కృష్ణకృత్యము=కృష్ణునిపని, కర్ణపరంపరన్=(చెవినుండిచెవికి) ఒకరినుండి యింకొకరికి, పరివాదము=నింద, లోకవేది=లోకములను దెలిసికొనువాఁడు, నెరవరులు=నేర్పరులు.

(15) బలవత్సింహ...పరికరున్=బలవత్=బలముగలిగిన, సింహవరిష్ఠ=శ్రేష్ఠమగుసింహముచే, పాటిత=చీల్పఁబడిన తను=శరీరమునుండి, పరిభ్రష్ట=జారినటువంటి, భూషా=అ

లంకాంగములును, అంబర=కట్టుబట్టలును గలిగినట్టియు, ఆకుల-చెదిరిన, కేశపాశున్ - కేశముల సమూహముగలవానిని, కర=చేతినుండి, స్ఖలిత=జారిన, ఖడ్గున్=కత్తికలవానిని, ముక్త...సంస్థున్ - ముక్త=విడువఁబడిన లేక జారిన, పల్యాణ జీనుచే, సంవలిత-చుట్టఁబడిన, గ్రీవ=మెడయందును, శీర్ణ-చెదిరిన, కేసర=జూలుకలిగినట్టియు, మృత=చచ్చినట్టి, అశ్వ=గుఱ్ఱముయొక్క, ప్రాంత-సమీపమందు, సంస్థున్= ఉన్నట్టివానిని, రజః-ధూళిచే, కలుష=మురికిపడిన, శ్మశ్రు-మీసముగల, ముఖున్ - ముఖముగలవానిని, క్రవ్యాద=రాక్షసులచే, సంవేష్టితున్ = చుట్టఁబడినవానిని, ప్రసేనున్, కనియెన్.

(16) ఋక్షపదంబులు=ఎలుఁగుయొక్క పాదములు, సర్వవీక్షణీయము - అందరిచేఁ జూడఁదగినది, ధాత్రి-దాది, బుజ్జవంబునయందున్=బుజ్జగింపునందు. వ్యా॥వి॥ నకార మిచ్చట "అందు" పరమైనను వచ్చెను.

(17) జాంబవన్నిహతము-జాంబవంతునిచేఁ జంపఁబడినది.

(19) అనంతద్యుతినూత్నము - అంతములేని కాంతులచేత నూతనమయినదియు.

(21) బాహా=బాహువులయొక్క, బంధుర=దట్టమైన, వ్యూహన=రచన, (ఎగుటివానిని బట్టుటకుఁ జేతులుచాచుట) యొక్క, ఉద్ధతిమైన్ - ఆడంబరముతోన్, పటు...బలంబునన్ = పటు = బలమయిన, భుజ = బాహువులయొక్క, వ్యాఘాత-దెబ్బలనెడి, నిర్ఘాత = పిడుగులయొక్క, సంపతన-పడుటచేత, ఆభీల=భయంకరమయిన, బలంబునన్ =

బలముతో, తొడరెన్ = ఎదుర్కొనెను. ఏకవింశతిసంఖ్యా – ఇరువదియొకటియను సంఖ్యతో, కలిత = కూడుకొన్న, అహముల్ = దినములు.

(22) బలదేవ + అనుజుడు – బలరామునితమ్ముడు.

(23)! నిర్విలోపతన్ - లోపములేకుండునట్లుగన్, ఆపాద్యయనమున్ - త్యజించి, విహిత . దానములు – చేయబడిన విస్తారమయిన తిలపిండదానములు

(24) పరిబలసంప్రహార ఖేదంబు – దెబ్బలచే కలుగు బాధ.

(25) భుజంగములు – నాగులు, గగనచరులు = అంతరిక్షమందుసంచరించువారు (ఖేచరులు), పరిభావము = తిరస్కారము, తిర్యగ్భవులు – పశుపక్ష్యాదులు, పాత్రీ = పొందబడిన పునస్సముద్భవునిగాన్ = పునర్జన్మకలవానినిగాన్. అలం. కావ్యార్థాపత్తి.

(26) ఆత్మావతరణము = తనయొక్క యవతారము.

(27) ఆయతసమరశ్రమము = విస్తారమైనయుద్ధమునందలి ప్రయాసము.

(28) పరివాదపరిహారంబు – నిందపోవుటకొఱకు, అర్థజ్ఞుండు = నీతి తెలిసినవాడు.

(30) సమ్మదస్ఫారతన్ = సంతోషాతిశయముతో, ఎలప్రాయము – యౌవనము.

(32) మిథ్యాభిశంసనశమనంబు = అపవాదయొక్క శాంతిని.

అపకారింతుఁడు=పరుగెత్తిపోవువాఁడు, విద్రావింతతన్=భయముచేన్.

(45) కడువెసమైన్=మిక్కిలి వేగముగాన్.

(46) విహతుఁడు=శత్రువు.

(49) విటపంబు—వృక్షము.

(51) తృష్ణ—ఆశ, ఇట్టిఁడు=ఇట్టివాఁడు —వ్యా. వి. అట్టి ఇట్టి ఎట్టి శబ్దముల సమాసమందు తచ్ఛబ్ద వకారము వాఁడు) నకులోపము. ఇట్లే అట్టిఁడు, ఎట్టిఁడు.

(52) సాంత్వనంబులు=బ్రతిమాలుకొనుటలు, తత్సదనంబునన్=అతనియింటియందున్, రథ్యము—గుఱ్ఱము.

(53) మహోదగ్రసత్త్వున్=గొప్పదైన, అణచుటకుశక్యముకాని బలముగలవానిన్, సాత్త్వికాగ్రిణిన్=సత్త్వగుణముకలవారిలో శ్రేష్ఠుని, దామోదరపూర్వజున్=కృష్ణునకన్నయైనవానిన్.

(54) సవిశేషార్చనాతోషితున్= సవిశేష—సాధారణముకాని, అర్చనా=పూజలచే, తోషితున్=సంతోషించినవానిన్, ఆచార్యుఁడు=గురువు.

(55) అస్మ్రయిన్=అకీలిగాఁ, అస్మ + ఉపభోగము=తనయొక్క యనుభవము, హుతంబులు—హోమములు, ఊర్జితముగన్=చక్కఁగన్, అతులితంబు=సాటిలేనిది, యాజనము=యజ్ఞము, ఒకఁడు—ఒకటి, కృత్యము—చేయవలసినపని, మారి=ఒకవిధమైనరోగము, భద్రము=మంగళము.

(57) కలఁక=కలహము, చుట్టలు=(రూ. చుట్టాలు,చుట్టములు).

(59) ఒక్కట యున్న యనికిన్ = ఒక్క మాటుగాన్ (Suddenly.)

(61) జనపదమునన్=దేశమునందున్, సంజనితములు గావు=పుట్టవు, అనుపమ...ంబుల్=పాటిలేని దుర్భిక్షము, మారి, అగ్నిభయము.

(62) అవగ్రహోపద=వర్షము లేకపోవుటవల్లఁ గలిగిన బాధ, భవదీయ=నీసంబంధమయిన, వదన=ముఖముయొక్క అవలోకనము=చూచుట, మొదవు=ఆవు, అవనిసురునకు=బ్రాహ్మణునకు, వత్సరత్రయము=మూఁడుసంవత్సరములు, మదీప్సితము=నాకోర్కె, కాశ్యపతి=కాశీరాజుయొక్క భార్య, గోప్రదానప్రసూత=గోదానము చేయుటచే పుట్టినటి అసాధారణ=సామాన్యముకాని, గౌరవముచే, ఉదారుఁడు =గొప్పవాఁడు.

(65) ఏతావన్మాత్రము=ఇంతమాత్రము, ఎగ్గు-కీడు.

(66) రథాంగధరుఁడు-చక్రధరుఁడు (కృష్ణుఁడు) ఇతనిచక్రమునకు సుదర్శనమని పేరు. ఉపప్లవము=ఉపద్రవము

(67) అల్పప్రహేతువు=స్వల్పమయినకారణము, అనల్పము=గొప్పది, దుఃఖ + ఆది + కలుషములు=కరువు మొదలుగాఁగల బాధలు, ఈదృశ + అద్భుత + భూతి=ఇట్టియాశ్చర్యకరమగు ప్రభావము, ఓలిన్-క్రమముగాన్, తోన తొడఁగెడున్=వెంటనే ప్రారంభించును, ఎడపడక=విరామములేక.

(68) ఒందుకార్యంబు=వేరొకపని.

(69) సరస + ఆలాపములు=రసవంతములగు మాటలు, లాలిత + మృదు + గోష్ఠీ + పరిణతుఁడు= మనోహరమైనట్టియు, సరళమగునట్టియు, సల్లాపమందు నేర్పుగలవాఁడు, భోజవిభున్=(అక్రూరున్) భోజవంశపురాజుని.

(71) కడుసారము నాఁదగు సుజ్ఞానైకత్న స్యమంతకమణి= మిక్కిలిసారముగలదని ప్రసిద్ధిఁజెంది ప్రకాశించుచున్నస్యమంతకమణి, అకుటిలకర్మ=యోగ్యమగుకార్యము.

(72) భవదీయగురుత్వంబు=నీసంబంధమైనగొప్పతనము బహు + మతి + క్షమము=అందరియొక్క మనస్సులకు నిష్టమయినది.

(73) రౌహిణేయుఁడు= బలరాముఁడు, రోహిణిపుత్రుఁడు, ప్రసన్నుఁడు=దయగలవాఁడు, పరిష్కృవిచారుఁడు =మంచియోచనగలవాఁడు.

(74) అతులితమణి=సాటిలేనిరత్నము, సతత్క్లేశము= ఎడఁదెగనిశ్రమ.

(75) భవత్ + ఈప్సిత + అర్థ + కృతి + అ=నీచేఁగోరబడిన ప్రయోజనముయొక్క నెఱవేర్పుటయే.

(76) అధిక సుఖ ఆస్పద హృదయులు=విస్తారమయిన సుఖమునకు స్థానమయిన మనస్సుగలవారు, సత్ + అభినుత + చరిత్రా=మంచివారిచే బొగడఁబడిన చరిత్రగలవాఁడా

(77) కాంచనసంపుటంబు=బంగారపుపెట్టె, మధ్యందిన అర్క తేజః విరాజితంబు=మధ్యాహ్నకాలమందుండు సూర్యునియొక్క తేజస్సువలె ప్రకాశించునట్టిది, ప్రభావి-